శ్రీ శుభమస్తు.

# త్రిశంకువిజయము.



అను

గానప్రబంధము.

ఇయ్యది

విశాఖపట్టణము జిల్లా, అనకాపల్లి వాసుండగు


బీ. బాలాజీదాసునిచే


వ్రాయఁబడినది.

—:o:—


ప్రకటనకర్త:

బీ. అమ్మన్న.



సోల్ యేజంటు:

కురుకూరి సుబ్బారావు,

సరస్వతీ బుక్కుడిపో, బెజవాడ, కృష్ణాజిల్లా.

బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు

డి. కే పంత్ చే

ముద్రింపఁబడినది.

10 వ కూర్పు 1000 ప్రతులు.

*Reprint*
1930.



*Registered Copy-right.*


Price Re. 0-8-0] [వెల రూ 0-8-0.

# హెచ్చరిక.

ఆదిభట్ట నారాయణదాసుగారిచే రచియింపఁబడిన హరిక[illegible]
అన్నియు మావద్ద విక్రయింపఁబడును.

| | |
|---|---|
| జానకీ శపథము | 1- 0- |
| రుక్మిణీ కల్యాణము | 0-12- |
| మార్కండేయ చరిత్రము | 0-12-0 |
| హరిశ్చంద్రోపాఖ్యానము | 0-12-0 |
| అంబరీష చరిత్రము | 0- 8-0 |
| భీష్మ చరిత్రము | 0- 8-0 |
| గజేంద్ర మోక్షణము | 0- 8-0 |
| ప్రహ్లాద చరిత్రము | 0- 8-0 |
| పైయెనిమిది పుస్తకములుగల క్యాలికో బయిండు | 5- 8-0 |
| యథార్థ రామాయణము | 2- 8-0 |

వలయువారు:— సరస్వతీ బుక్ డిపో, బెజవాడ,

కృష్ణా జిల్లా.



శ్రీ

# త్రిశంకు విజయము.

శా॥ శ్రీరాజాంక! నగాత్మజాకుచతటీ శ్రీగంధ లిప్తాంగ! సం
సారాంభోనిధి మగ్నమర్త్య తరణా! సద్భక్తకల్పద్రుమా!
పారావారనిషంగ మౌనిగణ హృత్పద్మార్క-బింబోదయా
కారుణ్యాస్పద! మత్కృతింగొని ననుం గాపాడు మృత్యుంజయా!

## గురుస్తుతి.

క॥ తనరనాంధ్రభాషఁ గఱపిన
తగవరి పోట్నూరుకుల సుధావార్ధి విధుం
డగు వేంకటసామి మదీ
య గురుని మదిలో దలంతు ననవరతంబున్.

## కవివంశావళి.

సీ॥ ఫలసస్యవృద్ధి సద్వ్యాపారములచేత, మను అనకపల్లి గ్రామ
యుండ । గురు భరద్వాజస గోత్రప్రపావన, ప్రభుఁడు లక్ష్మణ
దాసు పౌత్రకుండ । రహిమీర కేశవరామాఖ్యునకు గన్న,
మాంబకు నే ద్వితీయాత్మజుండ । విశ్రుత గాన ప్రవీణుఁడౌ బా
లాప్ర, సాదుగారికి నే సహోదరుండ ।

గీ॥ శైలజాహృదయాబ్జ భాస్కర కటాక్ష
వీక్షణప్రాప్త గాన కవిత్వయుతుడ
శ్రీరమేశ కథాబోధ నారతుండ
నరయ బాలాజిదాస నామాంకితుండ.

మిత్రులారా !

వ॥ జీవకోటిలో నరజన్మ ముత్తమమని మీాఱెఱింగినదె, ఇట్టి జన్మ మెత్తినందుకు ఆనంద స్వరూపుండగు భగవంతుని దయనొందుటకై ప్రయత్నించుట ఆవశ్యకము. మఱియు, సుజనులయెడ వినయము, బీదల యెడఁ గనికరము, దేవునియందు ప్రపత్తి, మాటలయందు నిజము నెర పిన నరుండు సద్గతి నొందగలడు. చూడుడు. మున్ను సత్యవ్రతంబూని యశమొందిన హరిశ్చంద్ర చక్రవర్తిచరిత్ర విన్నవించెద. సకల సంపద లకునికిపట్టగు అయోధ్యాపురంబొకటి గలదు. దానిని హరిశ్చంద్రుడేలుచు చంద్రమతియను సాధ్వీమణిని బరిణయమయి, పుత్రకనిగని లోహితా స్యుండనునామంబిడి దినములు గడుపుచుండ, స్వర్గపట్టణంబున సింహాసనా సీనుండై యున్న దేవేంద్రుండు.

సావేరి — చతురశ్రగతి.

మునులారా! కనుడి మోదంబున వినుడి ॥ము॥
అనవతరము బాలాజీదాసు లాచరించదగిన తేటమాట ॥ము॥
భూలోకంబున మీాఱెఱుఁగని నరపాలురెవరు లేరు, వేమారు॥ము॥
చనువున నడుగుదు మానవలోకంబున భూతవర్తమానకాల
మనుజనాయకులలో నన్నృతంబాడని వారలున్న దెల్పుడు వినగోరుదు॥ము॥

వ॥ ఇట్లు ఇంద్రుండడుగ తాపసు లొకరి మొగం బొకరు చూ చుచున్న తఱితపోధనుండును మునికుల శ్రేష్ఠుండును భూతభవిష్యద్వర్త మాన వేదియు నగు వశిష్ఠుండు సంక్రందను నాలోకించి,

తో. ఆకర్ణింపుము పర్వతభేదీ! ఆర్యానుకూలవర్తి
రేకెత్తెను నరలోకములోన హరిశ్చంద్ర చక్రవర్తి
శివునిపద సరోజంబుల సాక్షిగా జెప్పెదఁ ద్రైశంకుండు
లవమాత్రము దప్పనాడడెప్పుడు రవికుల ప్రభూతుండు.

వ॥ ఇట్లరుంధతీరమణుండు పలుక, గాధినందనుండు విని కనులెఱ్ఱజేసి,

సీ॥ తమ శరీరమువంచి తగుబాటుపడలేక, విద్యకు నామంబు పెట్టిపెట్టి
ఘనపాండితీశక్తిగనలేక విబుధుల, పోపొమ్మనుచు నింటఁబొంచి

పొంచి! సానిపాపలతోడ సరసంబులాటకై, తమమాన్యములనెల్ల నమ్మి యమ్మి । సారాయిబ్రాంది సీసాలకొలదిఁ ద్రావి మితిలేనిమానసము మెక్కి మెక్కి ।

గీ॥ సుకృత కార్యములకు సున్న జుట్టిచుట్టి
చెడుగు పనులకు ముందుగ నడిచి నడిచి
కండక్రొవ్వున కాలమ్ము గడుపుచుండు
నేలదొరలేడ సత్యంబు నెఱపుటేమ.

వ॥ ఇట్లనగా వసిష్టుండు నవ్వి గాధేయు నాలోకించి.

బేహాగ్ — ఆదితాళము.

వినుగాధినందన
నను గెల్వలేవు నీమాటలిచట వచికిరావు నేనెఱుంగుదు నీలావు ॥వి॥
పిచ్చుక గరుడునితో సరియన వచ్చున దబ్బరలాడు రాచ
ముచ్చులఁ త్రైశంకునితో సమమన వచ్చున బాలాజి మెచ్చున ॥వి॥
వ॥ మఱియు వారి వర్ణనమును వినుము.

సీ॥ కొక్కొరొకోయని కోడికూసినయంత, స్నానంబుగావించి సంధ్య వార్చి।అవనీసురుల యంఘ్రులర్చించి పిమ్మట, నైదురీతుల తిండి నారగించి । విడియంబుగొని కొంతవడి నిద్రగావించి, తరువాత లేచి యాస్థానమునకు । జని రాజ్యకార్యముల్ చక్కగనవరించి సత్పండితాళిని సత్కరించి।

గీ॥ కాలమును ద్రోయుచుండు నా ఘనయశుండు
పద్మపత్రహితాన్వయ పావనుండు
అఖిలవిద్యాధికుండు, సత్యవ్రతుండు
శాంతమూర్తిః హరిశ్చంద్రచక్రవర్తిః.

వ॥ ఇట్టి సుగుణనిధియగు హరిశ్చంద్రుండు కల్లలాడు టెక్కడ? నామాటవిని యిట్టిపట్టుదల విడిచి నీ గౌరవము దక్కించుకొనుట మంచిదని యన విశ్వామిత్రుండరుణలోచనుండై పండ్లు పట పటఁ గొఱుకుచు,

తో. ప్రత్యేకము సెప్పనేల భూపతి ప్రభవంబొటకు మొదట
సత్యవ్రతుడవు గమ్మని వాణిజాని వ్రాసె నెన్నుదుట.

వ. నిజముగ నాతనిచే బొంకించితి వేని,

కళ్యాణి—ఆది తాళము.

వినుమూ గాధిపుత్రా! యిటుగనుమూ యోవిశ్వామిత్ర॥ విను॥
మునిపుంగవ త్రిదశాలయవాసుల ముందరబల్కెద నాప్రతిన॥ విను॥
మీసముదువ్వకుమా బాలాజిదాసావనుసాక్షిగ బల్కెద॥ విను॥
ఘన జపములు వర్జించి విప్రకర్మలను విసర్జించి
పెనుజందెమును ద్రెంచి కడుప్రియమున దలగొరిగించి తను
వున బూడిదనలదించి కరమున కపాలము ధరించి
దనరగ గాడిదమీద నెక్కి దక్షిణది క్కటమున విహరింతు॥ విను॥

వ॥ బొంకింపలేకున్న నీప్రతిన వెల్లడింపుమనఁ గౌశికుండు,

సీ. ఏలయీవాదమ్మ లీయోలగములోన, విను మిప్పు డేను గావించు
ప్రతిన । భూపతిచేత నే బొంకింపలేకున్న, దుంపలడిని వొట్టనింపి కొ
నుచు । చలికొండపై నెక్కి చర్మాంబరునిగూర్చి, తపము చేసితిగదా
తత్ఫలమున । నగమిచ్చి పెక్కేండ్లు చక్రవర్తిగనుంచి, యటుమీద
వాసవార్ధాసనమున ।

గీ. వ్యాస గౌతమ శాండిల్య వాలఖిల్య
కపిల కౌండిన్య భర్గ మృకండు కల్వ
నారదాత్రి మౌద్గల్య వినాద వల్య
కలశసంభవు లెఱుగంగ నిలుపువాడ.

వ. ఇవ్విధంబున నమ్మునిగ్రామణు లన్యోన్యము ప్రతినలు పలుక
సంక్రందనుండు ప్రకంపిత శరీరుండై పేరోలగంబు జాలించె. వసిష్ఠ గాధి
కులు కోపంబు లంతరంగంబుల గాపురంబు సేయ దమ తమ నెలవులంజేరిరి.
హరిశ్చంద్రుం డొకనాడు సూర్యునిపై చూడ్కి నిల్పి యర్ఘ్యమిచ్చుచు
మనమ్మున,

సీ॥ ఛాయావధూమన స్సారసభృంగమా ! శర్వరథాంగమా ! శరణు
శరణు ! పరమభక్తార్పిత పాయసాన్న ప్రియా ! సద్గుణసముదయా !
శరణు శరణు ! ఆశ్రితభక్తఘోరాఘవారణసృణీ ! గురువియత్పత
మణి శరణు శరణు ! పృథురత్నమయ రథాన్విత హారిత్సైంధవా !
శతపత్రబాంధవా! శరణు శరణు !

గీ॥ సర్వలోక సంస్తవనీయ! శరణు శరణు
శౌరిపద్మజా భవరూప ! శరణు శరణు
నిరుపమాన నిర్మలకరా! శరణు శరణు
పాహి మాం పాహి మాం పాహి పాహి పాహి.

వ. ఇట్లర్ఘ్యమిచ్చు సమయంబున గాధేయుండరుదేర తద్వార్తఁ యెఱింగి ముందుగ జని నమస్కరింప గాధిసూనుఁడవ్వాచు దీవింపఁ ద్రిశంకుండు "మహాప్రసాదము భవద్దర్శనంబున బవిత్రుండనైతి. మీరాక కారణం బెఱింగించిన నీదాసుండ నా తెఱంగున జేయంగల"డని కౌశికుండు నవ్వి.

తో. శివునకు బ్రీతిగ నేనొక క్రతువుఁ జేయ బూనితిని క్షితిని
రవికులతిలకా! దానికై కొంతద్రవ్య మడుగవచ్చితిని.

వ. కావున మూఁడుభారంబుల ద్రవ్యమిచ్చిన నాసంకల్పము సంపూర్ణముకాగలదన విని ధనాగారమ్మునంగల ద్రవ్యము కావలసినంతపుచ్చుకొమ్మని హరిశ్చంద్రుడువలుక గాధేయుం డాశ్చర్యమంది, త్రిశంకునందనా మాకు నీవంటిదాత యుండ లోపంబులేదు. మాకవసరము వచ్చినప్పుడడిగెద మంతదాక నీచెంతనుంచుమని గాధేయుఁడు జన, జంద్రమతీ ప్రియుండు మనమ్మున. నాదనామక్రియ—ఆదితాళము.

నేనేమిసేయుదు నిరాబారి చనియెను ॥నే॥
నేనొసంగినట్టి ద్రవ్యచయ మా మౌనీంద్రుడు తీసికొని చనినచో
నూనబాణవైరిని స్మరియించుచు నానగరమ్మున నుందుహాయిగా॥నే॥
అతడల్గిన శంకరాదులైన భయపడుదురు ఋణముంచి చనియె నే
తరినడుగునో తెలియదు బాలాజీ దాసావను డెటులగు నీమటులగు॥నే॥

వ. ఈగతి చింతించుతఱి విశ్వామిత్రకల్పితంబగు జంతువులబాధ సహింపలేక కావువాండ్రు ప్రభువునాలోకించి చేతులు జోడించి,

నాధనామక్రియ—త్ర్యశ్రగతి.

వేలేలే లేలేలేరాజా! వింతమేకము లరుదెంచె వినుమో మహారాజా!
నేల యేనినట్లు పెద్ద వాలుమేకము లరుదెంచె ॥వే॥
పైరులన్ని మేసి వరుగున మముడాసి
ప్రాణాలకు గాసి పరచెను గుణరాశి ॥వే॥
తోలగిగుడ్డవేలికతో వచ్చితిమి చాలక
నిలువలేము పాలికాపుల గావుమేలిక॥ ॥వే॥
వాటి జంపకున్న మా పాటికేగమన్న యీ
పూటమాకుబస్తు కట్టబోమిక మీశిస్తు॥ ॥వే॥

వ. ఇట్లు విన్నవింప నరేంద్రుండు వారలకుంగల వంతదీర్చెదనని యభయంబొసంగి భార్యనవలోకించి జోటిమిన్నా! వేటకొరకై వింధ్యాటవీతీరమునకుం జనవలసి వచ్చినదన విని సతీతిలకం బాశ్చర్యంబంది,

నవరోజు—త్రిపుటతాళము.

ఇంత యాకస్మికంపువేట యేలరా? నా ప్రాణనాధా!॥ యింత॥
వింతదోచె సకలభూతవితతిని మీ ప్రాణముగతి భా
వింతురుగద సదా విమతమదవిదార పరమోదారరుచిజితమార।
ఇనకుల ప్రదీపా! జీవ హింసకులు బీ. బాలాజీవర
దుని సత్కరుణకు బాత్రులుగారనిగదా మాంసమ్ములవిడిచితి॥ వింత॥

వ. ఇట్లన ప్రేయసీ! జంతుబాధచే వంతనొందు ప్రజలకు వాగ్దానమొసంగుటచే కొరడవికి బోవలసివచ్చినదనఁ, జంద్రమతి విని నాధా! యడవిజూడ వేడుక బొడమియున్నది. గాన నేనరుదెంచెదనని వల్కనేలమగండు సతీసుతసమేతుండయి విపినంబునకేగి జంతువులనదలించి కాపులబాధమాన్పి మఱల నింటికివచ్చుచు మార్గమధ్యమున విశ్వామిత్రప్రేరితంబగు జింకరాగ నేదొర గాంచి విస్మయమంది భార్యకుంజూపుచుండ నంత లోహితకుమారుండు దాని నవలోకించి తండ్రిని బిలిచి,

నాదనామక్రియ—ఆదితాళము.

బాబా! చూడుమా వచ్చుచున్న పసిడి యిఱ్ఱిని॥ బాబా॥
శ్రీబాలాజీవరదుని చేతనున్న జింకరీతిని॥

చూడు చూడు దాని సోయగమ్ము నేడు లేచిదెచ్చియిచ్చిన నా
మేకచీసి మీఁదగట్టి పచ్చిక మేపి దానితోడ నాడెద॥ బాబా
కోటలోన నున్న జింకదీనికి సాటిగాదు గనుము దానివంక
బూటకమ్ముగాదు తేకయున్న బువ్వదినుట నేడు సున్న బాబా॥

వ. ఈరీతి సకుగు కొమరుని ముచ్చటదీర్పనెంచి భూపాలుండు వెట్టియై యిట్టివెంటనంటిచన నది గౌశికునియాశ్రమంబునకు జని మాయ మయ్యె. అంత పల్లవకల్పితంబగు శయ్యపై జంద్రమతి యూరుపీఠంబున శిరముంచి నిద్రించుతరి సతీతిలకము చిగురుటాకులతో చేయబడిన వీవనచే చల్లని గాలిసోకునటుల మెల్లన వీచుచుండగా భూవల్లభుండు చెకుకలఁగని దిగ్గునలేచి గన్నీరువిడుచుచు భార్యనాలోకించి,

కైకవళి—ఆదితాళము.

ఏమని తెల్పుదునే చెలియా! ॥యే॥
సోమనిభాస్యా! నామనో రహస్య ॥మే॥
కొలువున బెద్దలఁగూడియుంటఁ దలమీఁది రత్నకలిత కిరీటు
మిలకూలునటులఁ దన్ని కేశములబట్టి యూరివెలుపల కీడ్చిన
పలువిధముల బాధలనుభవించి పదపడి బాలాజీవరదుని కృప
విలువలేని సౌఖ్యమొందినట్టుల కలగంటి నాతోంటికృత మిదియంటి॥

వ. ఇట్లని కడు చింతింపుచున్న సాధ్వీమణి విని మిగులభయమంది పయికిభయము లేని దానివలె నటించి, వల్లభా, కల కల్లని తెలిసియు నిట్లుచింతింప బాడియె ? ధైర్యమూనుండని పలుక, నామాటనమ్మక రాజుమిగుల బొగులుచున్నంత, నకటా! మకుటవకాడు మిక్కిలిపొక్కు చున్నాడు, దుఃఖమును బోదోలు మహిమగల గాన విద్యాప్రవీణు లెవ్వ రైనావచ్చి పాటబాడి రాచమేటి విచారమాపిన బాగుండునని యండజ యాన తలంప విశ్వామిత్ర కల్పితలగు మాలకన్నియ లిర్వురువచ్చి రాజు మ్రోల నిలిచి, హిం॥ భైరవి—త్ర్యశ్రగతి.

రాజశేఖరా! రిపు రాజభీకరా! సు
ధీజనానుకూలా! దినేంద్రకులశీలా! రా॥
మచ్చికతో భవదీయ సముఖంబున బాటఁబాడ
వచ్చినాము బాలాజీభక్తా గానానురక్తా! రా॥

వ. ఇట్లుయూలగరితలన, నేలమగఁడు వారలంగని మీమీ విద్యా కౌశలమిప్పట్టున వెల్లడింపుడన, వల్లెయని పల్లవాధరలు భూవల్లభునిపై దృష్టినిల్పి, హిం-భైరవి —త్ర్యశ్రగతి.

ఉతో ప్రియా! జాగో జీయొ కేలిడర్ లగీజీ॥
గజరగజరామైన పేని ప్రియా! ధర్మజాగో
సోతిధీమై నీందెక్యూమారె గజరాచోర్ చురాకీయా వు॥

వ. ఈగతి గాన మొనరింప నా హరిశ్చంద్రుడు సంతసించి కొంత ద్రవ్యంబొసంగ నా గోసంగిపడంతులు నగుచు నరనాయకు నవలోకించి,

గీ. ఏమిచెప్పుదుమయ్య పూదోమరమున
మమ్ము బాధించుచున్నాడు మన్మథుండు
గాన తద్బాధ నెరవేర్పఁబూనుకొన్న
నదియుమాకును బదివేలు సదయహృదయ.

వ. ఇట్లు చండాలకన్యలడుగ, భూవల్లభుండు చెవులు మూసికొని వెలందులారా! నే నేకపత్నీవ్రతుండనగుట మీ యభీష్టముదీర్ప నవకాశము లేదు. కాన నింతటితోఁ దృప్తిపొందిపొండన, వారలు మాకోరిక దీర్పకున్న నీనగలు, విత్తము నొల్లమని రాజునువంచించుటకై శృంగార చేష్టలజేయదొడంగిన, నృపాలుండు దయణాలోచనుండై వారలబాధింప నరుదెంచు సమయమ్మున సత్యకీర్తి హరిశ్చంద్రునిచూచి,

చ. అబలలబట్టి కొట్టుటకునై కొరడా కయిబూని వచ్చుటల్
సబబనితోచెనే? సతులునెప్పుడురే కళతాడనంబునై
రిబలమదంబడంచి కడలేనియశమ్ము గ్రహించు టుర్విలో
సొబగు నరాధినాథులకు సూర్యకులాంబుధి పూర్ణచంద్రమా!

వ. ఇట్లని నృపతికిం గల కోపంబు వారింప నంత చండాలకన్యలు,

కాఫీ—ఆదితాళము.

ఏలామనకు వాసిజోలి చెలీ॥ యేల॥
పూలకిల్తు కేలిలో నేలునునుచు బ్రతి
మాలిన మన కనుకూల పడడయ్యె నిక॥ యేలా॥
అలబాలాజీవరదుడౌ చలిమలపట్టి విభునితో
దులదూగు గాథేయునితో దెలుపుదము కలికి మగాములిక॥ యే॥

వ. ఈ గతినపుఁడాని పీతిరాగులై నాతులేతెంచి గాధేయు నవలోకించి,

తే. జనకా! యేమని తెల్పుదు మాభూజాని చాలకోపమునన్
గనికరింపకయె మమ్మునుగొట్టె స్తనుగొనుమా మారాయెండలిన్.

వ. ఇట్లా మూలచిగురుబోండ్లువిన్నవింప గాధిచూలి చిందులు ద్రొక్కుచు నేమేమి! నృపాధముండుమిమ్ము బాధించెనా? సరిసరి నాకోపాగ్నిని వాఁడే తెరంగున భరించునో చూచెదనని చట్టన వచ్చి కిరీటము నెడమ పాదమ్మున నేలగూలనటుం దన్న నామన్నుతేఁడు (కన్నునవచ్చి) మౌని పాదమును బట్టి,

ఉ. ఎంతటి నొప్పిపట్టినదొ హీరమణీమయమౌ కిరీట మ
త్యంతము దాకి మీమృదుపదంబునకు న్గుశికాత్మజాత! మీ
రింతటి పల్కబూనుటకు నేనొనరించిన దోసమేమి యో
శాంతివహించి మౌనికులచంద్రమ తెల్పుడు మీకు మ్రొక్కెదన్.

వ. ఇత్తెఱంగున హరిశ్చంద్రుఁడన గాధేయుఁడు గన్నుల నిప్పులు రాల్చుచు,

భైరవి — ఆదితాళము.

వినుమోరి నీ వపరాధివిగావటరా నృపా॥ విను॥
ఇనుకులాధమా ప్రాజ్ఞుడవని మనమునదలఁచియుంటినోరికొంటి ॥విను॥
పుడమిఁదొరలు లేరో? వేట కై యడవులకుంబోరో? యీ
వడతులపై యనుకంపవహింపక పట్టితివట తిట్టితివట కొట్టితివట!
తులువా! నాతోటకరుదెంచి జంతువులను బాధించి మఱి
యల పసిడి యుద్రివెంటనంటి యాయాసముగలిగించి కడు
నలుకబూని నాముద్దుకూఁతుల నటమట నొందించియుంటి విక
దొలఁగియేటులపోయెదవు బాలాజని పలుమరు రక్షించినట్టి యీ
జలజారిమౌళిసీకు దోడ్పడిన జడియనురా! వినువనురా! ఇదివినరా!

వ. కౌశికుం డిట్లన రాజు భయభ్రాంతుడై కరములుమోడ్చి,

గీ॥ కొడుకు లవివేకులై చేయుదురుకు తల్లి
సైపరే దల్లిదండ్రులు సంయమీంద్ర

కోయుదురె తూటికూర వజ్రాయుధమునఁ
గోప మిూరీతిఁ జూపిన నోపగలనె?.

వ. కావున నాతప్పులు సైరింపుండన గాధినందనుండు విని నవ్వుచు భళిరా, హరిశ్చంద్రా! నీపయి మాకు దయవచ్చినది.

ఉ. చూడు మదీయ పుత్రికల సుందరత న్గనగోటికైన నీ
మూడు జగంబులందు సరిపోలరు స్త్రీలెవరైన, మారు మా
టాడక నీలతాంగుల దయన్గని కౌఁగిట, జేర్చి వారలన్
గూడితివేని నిన్ను నలగోపతి గద్దియపైన నిల్పెదన్.

వ. ఇట్లనఁ, జంద్రమతీ ప్రియుండు గాధేయుంగని.

క. కులమునగల ధర్మం బా
వలనిడి మాలెతలఁగూడి స్వర్లోకసుఖం
బులనొల్ల నెంతజెప్పిన
గల రాజ్యంబైన విడుతుగాని మునీంద్రా!

వ. ఈరీతి భూపాలుండన నగ్గాధిసూతుండాతనిం గని.

కల్యాణి—ఆదితాళము.

మాటదాట రాదు నీవన్న ॥మాట॥
నాటిగబాలాజి నేలిన గంగాజూటుని పదమాన ముజ్జగాన ॥మా॥
మనుజనాథ! నీరాజ్యము మాకు సమర్పించిపొమ్ము కనుము విపినమ్ము॥
జనులకానవాలుగ నీముద్రిక నరగనిమ్ము చిరసుఖమ్ము గలుగునుజుమ్ము॥

వ. గాధినందను డిట్లన రాజు నవ్వుచు,

ఉ. పంటవలంతి నేలి పిదపం దపమెంతయొ చేసి కీర్తి చే
నుంటిరి మూడులోకముల నుత్తమసౌఖ్యము మాని బ్రమ్మఱిం
దొంటితపస్సునుండ మదిదోఁచిన బ్రాహ్మణద త్తమైన మ
న్నంటక తక్కు-రాజ్యరిమనంతయు గైకొను డో తపోధనా!

వ. ఇట్లని రాజ్యము ధారబోయ నతనిసాహసమునకు గాధేయుం డాశ్చర్యమంది రాజా! హరిశ్చంద్రా! నీరాజ్యమును మాకొసంగితివి గాన నాస్వాధీనమయినభూమిలో నీవుండగూడదు. కాన నిచ్చటనుండి బ్రాహ్మణ వల్లియని పుత్రకళత్ర సమన్వితుండవై

ఇట్లున జంద్రమతి భర్తంగాంచిదన కుమారునైనవిడిచి యీ ను గాపాడు టుచితంబన నరనాథుండా కలికి పలుకులకు మిగుల సించి నక్షత్రకునకు గేలూతనిచ్చి.

కళ్యాణి—ఆది

నడుమాసీడకు వే॥
కడుచల్లని జలమును ద్రావించి బడలికదీరగ నడుగులనొత్తెద॥
పదియమగుల దూరముగలదదెవట
పాదపమ్ము వేగిరమ్మ లేచి ॥నడు॥

వ॥ ఇట్లని యా వలువును మెల్లన నడిపించుకొని యొక శరంబును సమీపించి చల్లని నీటిచే వీరల దృప్తులంజేసి తానుస్నా నచ్చి సంధ్యవార్చి గొంతజలమాస్వాదించి యడవుల ద్రిమ్మరుచు మఱ్ఱిచెట్టుక్రిందజేరి కసపు శయ్యగల్పించి నక్షత్రకుని దానిపై బెట్టి పైటకొంగు పరచి కుమారుండు జంద్రమతియు నిద్రింపుచుం శ్చంద్రుండు భార్యనవలోకించి కంట దడివెట్టి మనమ్మున.

సీ॥ చలువతోటలలోన సంచరించెడి లేమ, యడవి భూములయం
నడువవలసె। నెలరాలపై గమనింపుచుండు నెంతకరకు
పై దిరుగవలసె। ఆరుచవుల తిండి నారగించెడిచాన, దు
బొట్టనింపవలసె। మేడమెట్టులనెక్కనోడు సాధ్వీమణి,
ల నల్లాట మాడ వలసె।

గీ॥ అకట నాపాలబడి యిట్టు లనుభవింపు
చున్న దీకలోదరి నన్ను గన్న తండ్రి
లోహితుండల బగ్గిలలో షికారు
చనెడి వానికి నీగతి సంభవించె.

వ॥ ఇట్లు వితర్కించు సమయమ్మున భేతాళుండరుదేర యించి యుచ్చోటువాసి వచ్చుచు దారినడును నడ్డముదగిలిన కా ను గడచి కాశీపురము సమీపించి గంగానది జలస్నానమాచరిం వ్యాధాలయము జొచ్చి మునమ్మున,

సావేరి—ఆది.

శంభో! హర హర శివ శివ॥ శంభో॥
కుంభిదానవహరా దిగంబర జంభవైరిపూజిత చరణయుగళ ॥శంభో॥
మేరుచాప చిత్స్వరూప ధవళాకార పాపహర భుజగకలాపా! ॥శం॥
దిక్కులేని వారలకును నీవేదిక్కని మదినమ్మి
మ్రొక్కితి మీయడుగుదమ్ములకు మముద్రోవగ నికెపరమ్మి
పక్కకన్న దక్కువయ్యె నిక మాప్రజతుకుం గనుగొమ్మి
అక్కటకటా యిట్టి యిడుములెవరైన బడరనుమ్మి
మక్కువ నామార్కండేయుడు మీప్రక్కజేరి గాగలించి వేడిన
దక్కినంపు సామిని శాసించిన దానవచయహరణ మారుత
భుక్పాభరణ మౌనిగణ
పూజిత మృదుచరణ మాకుగల చిక్కుద్రోసి కరుణ నేలు
బాలాజి దాస శరణ భవతరణ ॥శంభో॥

వ. ఇట్లు శంకరుని ధ్యానించి యొక రమ్యప్రదేశంబు జేరియుండ నక్షత్రకుండు రాజా గడువు కాలము సమీపించినది. ఇదివర కొక పయిసా నియ్యలేదు. నీయొద్దద్రవ్యమున్నట్లుగనపడదు. గావున మాయప్పుతీరు మార్గమూహింపుము లేదా, మంజరి.

వారణాసిలో నైదుదినంబులు వసియించినట్టి వారు
ఘోర పాపరహితులై ముక్తి చేకొందురంద్రు పదియారు
దినములయ్యె నిచ్చోటికి నీవరుదెంచి గనుక మోక్షమ్ము
జనవర కరగతమయ్యె లక్షబొంకినజెడవు నిహపరమ్ము
లరకాసైన లభింపనేర దీపురమున గాన ఋణమ్ము
నెరుగననుచు బొంకము నేనిపుడే నరిగొద మాటలునమ్ము.

వ. ఇట్లన హరిశ్చంద్రుండు నక్షత్రకేశ్వరా స్త్రీలయెడ, వివాహము లందు, ద్విజగోరక్షణమున, ధన, మాన, ప్రాణభంగంబుల బొంకినను దోసమబ్బదని శుక్రుండుపదేశించినట్లు నన్ను మూర్ఖునిగా దలంచి నాకు జెప్పుచుంటివి. పరమేశ్వరుండొకచోటనే యుండునా! యీస్థలమే పవిత్రమై జనులకు మోక్షంబొసంగునా? సకల జీవాధారుండగు పరమేశ్వరునకు విశ్వమంతయు నిలువ నాలయంబే కదా?

మంజరి

చూడుము విపత్తు లెన్నియైన జేకూడిన ధనరాజ్యమ్ము
లోడిన ప్రాణములూడిన మర్త్యుండాడ రా దసత్యమ్ము
బొంకినమానవు డఘరాహిత్యము బొందగ నేరండెపుడు
బొంకుదునే యల్పసుఖముకొఱకై పూర్ణముగ దెలిసియిపుడు?॥

వ. ఇట్లన నక్షత్రకుండు విని రాజా నే జెప్పినట్లు చేయు నీయ కొనకుండినఋణము దీరు మార్గం బాలోచింపుము నేసత్వరముగా నిజని వాసంబు జేరవలెనన, భూపతి మారుబల్కు లేక మోమువంచికడగంటను భార్యముఖ మాలోకింప నంత నక్షత్రకుండు రాజు నవలోకించి.

తో. బూచివాని గతి నిటునటు దిక్కులు చూచిన లాభంబేమి
దాచితివా ధనమప్పుదీర్ప నాలోచింపుము భూస్వామి.

ఇట్లన భూపుం డేమియు ననసేరక చూచుచున్నంత జంద్రమతి వల్లభునవలోకించి,

నాదనామక్రియ—ఆదితాళము.

చింతింపనేలా? భూపాలా? బుధనుతశీలా! ॥చిం॥
అంతటిదశ యింతకు వచ్చె నిక నెంతటి యవస్థ రానున్నదో మన
వంతుక వచ్చినది యనుభవింపక పరులనుభవింతురే? ప్రియా!
పుడమిజేనుల కీర్తియేశ్వనము విడువరాదు ధైర్య మిట్టియిడుముల
బడిన మానిఋణముదీర్ప నన్నంగడినిబెట్టి విక్రయింపుడు ॥చిం॥
అప్పుదీర్వ నింతకన్న వేరు చొప్పుగాన రాదీగతి జేసిన
తప్పుక బాలాజీనేలిన గౌరీధవునకు సంప్రీతికాగలదు ॥చిం॥

వ. ఇవ్విధంబున బలుక, త్రైశంకుండు బోటిమిన్నా, పడంతినమ్మి బ్రతికిన పాపాత్ముం డెవ్వోటనైనం గలడా యన, జంద్రమతి భర్తను విలోకించి.

తోడి—రూపకము.

సందియ మొందనేల యోనరపాలా! ॥సంది॥
అందరికిని సుఖదుఃఖము లరయ సమము సుమ్ము ॥సంది॥
గజబిజ లెందుకు దోసమ్ము గలదె కల్లకన్న
నిజముకన్న లేదిల పుణ్యంబు రాచ మిన్న

అరలి ప్తలోబోవు భార్య నమ్మిన దోసమ్ము
అనృత మాడు దోసము బాయగ నెవరి తరమ్ము
పాలిత బాలాజిపై భారముంచి నన్నమ్మి గుణ
జాలా మునియప్పు తీర్చి యశమును జేకొమ్ము ॥నంది॥

వ. ఇట్లు పలుక హరిశ్చంద్రుండు వల్లెయని యాపల్లవోష్ఠి నంగడి కిందోకొని పోయి పౌరులారా! నాపేరు హరిశ్చంద్రుడు- నే నూర్యవంశ సంజాతుండ, త్రిశంకునందనుఁడను నారాజ్యంబంతయు గాధేయునకు సమర్పించి మఖార్థమయి వాగ్దానం బొనర్చినవిత్తమీయఁజాలక నాభార్య నమ్మనీయకొంటిఁ గావున.

సావేరి—ఆదితాళము.

మిగుల చౌకబేర మిదియు జందు మెలఁతను గొన రండు ॥మి॥
మగువ త్రిశంకునికోడలు దీనిపసికనుగొన్న సంతసింత్రు ప్రోడలు
నవ్వులాటకైన దప్పుగూయదు నాతిమిన్న చెఱుపుపనులు జేయదు
బువ్వబెట్టువారిమాటద్రోయదు పుణ్యకార్యములకు వెనుకదీయదు।
పరపురుషులన్నదమ్ములని దలంచు పరులసొమ్ము దృణముగ భావించు
నిరుపేదల గన్న సత్కరించు నిరతము బాలాజీని స్మరించు॥ మి॥

వ. ఇట్లమ్మజూపినంత, కలిరాజు వృద్ధబ్రాహ్మణవేషమూని కాల కౌశికుండను నామంబున వచ్చి హరిశ్చంద్రు నవలోకించి,

ఝంఝూటి—త్ర్యశ్రగతి.

ఎవడవురా నీవు యిందేల వచ్చినావు ॥యె॥
అవమానం బనక భార్య నమ్మజూపెదవు॥
ఆలిని మర్యాద సేయక యమ్ముట తప్పుగాదా
చాలు మాతి మీద మీసంబు నీకు లేద ॥యె॥
వినరా దోసకారి నీ వితర దేశము జేర
ననబోణి దొంగిలించినావని వింటి రోరి ॥యె॥

వ. ఇట్లు కాలకౌశికుండన నరనాథుం డాతనిగాంచి బ్రాహ్మణో త్తమా! నీకీప్రసంగమేల? కొనుటకు శక్తికలదేని మూడుభారముల ద్రవ్యంబిచ్చి నెలంతను గొనిపొమ్ము లేదా వచ్చినత్రోవబట్టు మన నాకాల

కౌశికుండు ముభ్ఛారముల వి త్తంబొసంగి సతీతిలకంబును రమ్మన నవ్వేలం
ది భ ర్తనవలోకించి, నాథా! నే జనియెద బూర్ణానుగ్రహ ముంచుమని
పాదములపై నొరగినసంత, రాజచూడామణి భార్యరెండు చేతులంబట్టి
కంటనీరునించి

సీ. అర్ధాంగివైన నిన్నాదరింపగ లేక, విధివశంబున నేడు విడుచుచుంటి
దాసీజనులవల్ల దగుసేవగొను నిన్ను, బసికత్రైగా నేడుబంపుచుంటి
ముద్దుమాటలనైన ముదమొంద గొడుకు నీ చెంత నుండుగటంచు
వంతనుంటి! ఇంతకాలంబున కేనాకినై యుండ వలసివచ్చెనటంచు
గలగుచుంటి!

గీ. పద్మభవుప్రాతం దాట నెవ్వరితరమ్మ
చాన! లేలెమ్ము నీదార శాసనమ్ము
పగిదినడచి శీలమ్ముగాపాడుకొమ్ము
కంట దడిమాని పాటునివెంటంబొమ్ము॥

వ. ఇటు లానరవిభుం డన, జంద్రమతి సుతుని వెంటబెట్టుకొని
చనుచుండ లోహితాస్యుండు తల్లిని విలోకించి,

నాటకురంజి—త్ర్యశ్రగతి.

అమ్మా! మా బాబేడె॥ యమ్మా॥
బొమ్మలను దెచ్చుటకు వెళ్ళెనా వెళ్ళెనా॥యమ్మ॥
ప్రీతిగల దాతలేరే పండుకొతి రీతినున్న తాతయెవ్వడే॥య॥
నీటుగల గుఱ్ఱము లేవే యీపేటకు మనకోటకెంతె దూరమె॥య॥

వ. ఇట్లు కుమారుండడుగ జంద్రమతి కంటనీరునించి,

ఉ॥ మందను దప్పి గోవు పెనుమల్లడి నొంది యదృష్టహీనతన్
బందెలదొడ్డికిం జనినభాతిని కౌశికమౌని మాయచే
నిందులనుంటి, నాజనకుం డీతడు, ముద్దుకుమార, నీమదిన్
గుందుట మాను, నీదుజనకుం డరుదెంచును నేట రేపటన్.

వ. ఇట్లుకుమారునూరడింపుచు పాటునిగృహముం జేర నప్పాటుని
యిల్లాలు కలహకంఠి మగని జుట్టుబట్టి నామీద దీనింగొని తెచ్చితివా!
యన, జంద్రమతి,యమ్మామగండు గ్రుడ్డివాడయినను ముసలివాడయినను
భర్తనే దేవునిగానెంచిసేవ యొనరించి

సద్గతినొందుట కులాంగనలకు న్యాయమట్టియెడ నీగతి పతిని బాధింతురా!
నేపని కర్తగా నరుదెంచితిగాని వేఱొండుదలంపవలదన, నాకు నీతులు నే
ర్పుదానవా! యని కొప్పుబట్టి క్రిందుగ నీడ్చి పదతాడనంబొనర్చి దానికి
హంసనారియని పేరిడియె.

సీ. ఇలు గుమ్మముల నూడ్చి కలయంపు వేచల్లి సొంపుగా ముగ్గునుంప
వలయు । అంట్లు చక్కగదోమి యప్పడంబులపిండి, విసరి పొన్నిడ
కలు పెట్టవలయు । విస్తరంటలుగుట్టి వేగ యంగడికేగి, కూరల గొ
నితెచ్చి కోయవలయు । మాతిండి యైన పిమ్మట నెంగిళులు దీసి,
కడుశుభ్రముగ నిల్లుఁ గడుగవలయు।

గీ॥ మిగిలినట్టి కూడిర్వురు మెక్కవలయు
సంజవడినంత దివ్వెలు సర్దవలయు
పగలు రాత్రియు నా గాళ్లుఁ బట్టవలయు
బైట జాపపై మంచులోఁ బండవలయు॥

వ. ఇట్లాజ్ఞాపింప వల్లెయని కుమారుడు దాను పాలునింటకల ప
ను లొనర్చుచు వసించియుండ, హరిశ్చంద్రుడు సతి నమ్మిన విత్తంబు న
క్షత్రకున కిచ్చి నమస్కరించి చనుమన, రాజు నాబాపండు దిలకించి మా
గురువుగారి ద్రవ్యమిచ్చితివి నానిమిత్తమేమి యాలోచించితివన, విని నక్ష
త్రకా, మీ గురుప్రయోజనమును గురించి వచ్చితిరిగాని నన్నుద్ధరింప న
రుదేరలేదు గాని నింతటితో దనివినొందిచనుండన నక్షత్రకుండు రాజా!

తే. జనవర కారడవులలో వెనువెంటను దిరిగినమాత్రమున
నను నీ సేవ యొనర్చెడిభృత్యుండనుకొంటివె మనమున.

వ. నీతాతగారి నవుకరుననుకొంటివా? నీయబ్బగారి నవుకరు న
నుకొంటివా? కొంచె మాలోచింపుమన, నయ్యా! యేలవరుషవచనము
లు పలికెదరు? రెండు రోజులలో మీకొసంగెదనన, మంచిది యీవిత్త
మేనాది; గురువుగారి ఋణము దీర్పు మన హరిశ్చంద్రుడు,

నాదనామక్రియ—త్రిపుట.

చంద్రశేఖరా! యీబాపండిటులచేసె॥ చం॥
చంద్రబీజ పర్వతనిలయ! సర్వలయ వినిర్జిత ప్రళయ॥ చం॥
దిన ద్వయములో గాధేయుని ఋణముదీర్ప నేయుపాయము
గనుపట్టదు బాలాదీవ్యాద్వనజమిత్ర పార్వతీకళత్రా!॥ చం॥

వ. ఇట్లువితర్కించుచున్న నరపాలు నాలోకించి రాజా! చింతింపనే ల? పరమేశ్వరుని కృప నీయందున్న యెడ నీదురవస్థ నీకేల? మారుణము దీర్చ మార్గ మాలోచింపుము; లేదా, లేదనిచెప్పుము. చనియెదనన బ్రాహ్మణోత్తమా! మీఋణము దీర్ప సామ్మించుకయు గానరాదు. న న్నమ్మి మాయప్పుదీర్చుకొండన, వల్లెయని యంగడికి హరిశ్చంద్రుని దో డ్కొనిచని బజారునడుమ నిలుపంబెట్టి నాగరులారా! యీతండు త్రిశంకు పుత్రుండగు హరిశ్చంద్రుండు, విశ్వామిత్ర ఋణముదీర్ప నుపాయంబులేక విక్రయింపుమని నిర్ణయింప, నీతని విక్రయింపఁబూనితి.

సీ. అలగాధినందనుం డడుగనామానికిఁ బుడమియంతయు ధారవోసినాడు
ప్రజలు సంపదలచే వర్ధిల్లుచుండ న ట్లేడుదీవులప్రీతి నేలినాడు
గర్వంబుచేఁ గారు కానలలో సంచరించు భేతాళు జయించినాడు
భరియింపరాని యాపదలంటుకొన్న ద, బ్బరలాడనని పట్టుపట్టినాడు
గీ॥ దినమణి కులమ్మునకు వన్నెదెచ్చినాడు
ఏకపత్నీ వ్రతాంబుధి నీమవాడు
గనుక మూఁడు భారమ్ముఁ ధన మొసంగి
వీన గొనిపొండు, వేరండు విబుధులార!॥

వ॥ ఇట్లువిక్రయింపసమకట్టిన యముండు వీరబాహుఁడను నామం బున చండాల రూపంబున నరుదెంచి, వీని నేను కొనియెద, నన రాజువి లోకించి చండాల! నీవెక్కడ? నన్నుకొనుటెక్కడ? నీ దురాలాపంబులు చాలింపు మనవీరబాహుండు, రాజా! మాటిమాటికి, చండాల, యని ని రసింపుచున్నావే,

తో. భూపా! మనయిరువురకు న్భేదముఁ జూపు మధిక ద్రవ్యమ్ము
చేసిన దాసులుగలరు నాకు నీతో పనిలేదు నిజము॥

వ॥ ఇవ్విధంబున, బలికిబాపండడిగిన ద్రవ్యంబొసంగి రాజును వెంటదీసి కొని చండాలవాటికకు జనిజని, రాజా! నీకు వీరదాసుండని నామంబిడితి.

సీ. మిగుల చౌకగవచ్చు మెత్తనిచర్మము, ల్గొనితెచ్చి చెప్పులు గుట్ట వలయు! రాత్రియామములందు రాజవీధుల జాటి, గట్టిగ టమట మా గొట్టవలయు! రేబవళ్ళన్గులఁ ప్రేతభూమికిదెచ్చు, వారిచ్చు సుంకము ల్బట్టవలయు! గ్రామాంతరమునున్న గ్రామసూకరముల బిలచి యాహారంబుఁబెట్టవలయు!

కాఫి — ఆదితాళము.

తనయా! తనయా! నిన్నిటు బనిచెదర సవినయా ॥తన॥
కనికరముమాని బ్రాహ్మణుండు నిను గానన భూమికి బంపదలచెనా?
అనయము సిరితో దులదూగుచుండు యతివలకు బుట్టక విపత్తుల
మునుగుచున్న నాకడుపున జనించి పెనుబాము లనుభవింప వలసెనా?
కారు కానలకు బొమ్మనుటకు నానోరెట్టులాడురా
పారుని శాసనంబు మీరిన స్వామిద్రోహమబ్బురా కాన
మారువల్క రాదు చేయుట మంచి నీదు నాదు
పూర్వపుణ్యమెట్టులున్నదో యాతీరున బాలాజీదయ రాకపోదు ॥తన॥

వ. ఇట్లు చింతించి సకలదేవతా ప్రార్థనంబుగావించి కుమారుని దీవించి పంప లోహితుండు తోడిబాలురంగూడియడవికేగి సమీపమందున మఱ్ఱిచెట్టు క్రిందంగలపుట్టపై నొకపాదము రెండవపాదముమ్రానిపై నుంచి యిందెక్కియాకులంగోయ,

క. ఆతరి నొక సర్పంబల
భూతలపతిసుతుని పాదమునఁ గఱవంగా
నాతత నోటను గార్చుచు
హాతల్లీ! యనుచు నొరగె వవసీసలిపై.
వ.తోడిబాలురంగాంచి నెచ్చెలులారా!

సీ. తడవయ్యెనని యుపాధ్యాయుండు కోపించి, దండింపఁబూను సత్వరముపొందు। గురునకు ఫలసమిత్కుశ పుష్పపత్రసంతతిని సద్భక్తినం పితిననుండు। లోకమే నేనని లోనెంచు తల్లిబాకీ నాకు దీర్పనేగితి ననుండు। గురునాజ్ఞ వేగగైకొని యొక్కసారి మాయమ్మను నను జూచి పొమ్మనుండు।

గీ. అధికమగు బెంగ నాకై నిరంతరమ్ము
పొందు నాతల్లి నిటకు బంపుడు విషమ్ము
చెదరి తలకెక్కె నిల్వదీ జీవనమ్ము
వగవకుఁడి డిదె కడపటి వందనమ్ము.

సీ॥ తరులార కంటిరే దనశోభ నబ్జాల, యాకుమారునిబోలు నాకుమారు । మారులార కంటిరే యలఘుదర్పమున నా, ర్యాకుమారుని బోలు నాకుమారు । కరులార కంటిరే నిరతధర్మమున ఛా, యాకుమారునిబోలు నాకుమారు । పులులార కంటిరే ముఖకాంతికి నన నూ, యాకుమారుని బోలు నాకుమారు।

గీ॥ నెచటనున్నాడొ దెలియ రాజేమిసేతు
గాంచినటులైన దెలుపుడీకరుణతోడ
ప్రకటితోత్తమ చారిత్రు రాజపుత్రు
సాహసాహస్త పంచాస్య లోహితాస్యు॥

వ. ఇటుల పుత్రునికై వెదకి యొకచోట నేలంబడియున్న వానిం గని లేపిలేవకున్నంత వక్షస్థానంబున గరతాడనంబొనర్చుచు,

ముఖారి — ఆదితాళము.

లేవవేమిర తనయా! ॥లేవ॥
యేవిధముననిందు । జీవించియుందు నెందు ॥లేవ॥
చెల్లబో నేడు నీతండ్రి । యుల్లమేరీతి దల్ల
డిల్లుచున్నదో దెలియ దల్లన నాముద్దు కొడుకా! ॥లేవ॥
అలనాడు నీచేతి నీ । శ్వాధారమనియుంటి
గలనైన నిటువని । కాదనుకొంటి కొడుకా! ॥ లేవ॥
కన్నతండ్రి పాలితబాలాజి । కెన్నడెగ్గుచేసితినో యా
పన్నగముననీఆకై క । ల్పనచేసెనన్నా । రాచ
మిన్నా ననుగన్నతండ్రి క్రన్ననబలుకకున్న బ్రతుకుటనున్న ॥లేవ॥

వ. ఇట్లేడ్చుచు నుచిత సంస్కారము చేయందలంచి మూపునబిడ్డ నెత్తుకొనివచ్చుచుండ రుద్రభూమింగల హరిశ్చంద్రుడు మానసమ్మున.

సీ. తపసికి నేల దత్తముజేయుటొక్కటి, యతడప్పు మఱలనిమ్మనుట రెండు ।నక్షత్రకుడు నన్ను నలయించుటది మూడు కొమ్మనమ్మి ధనముఁగొనుట నాల్గు । ముద్దుబిడ్డడు దూరమున వతిలుటయైదు

నాకొడుకా యెంతతల్లడిల్లినావో యిట్లురావో ॥నీకు॥
మగనిఁబాసి నిన్నుజూచి । మదిలోపల బాధుకొన్న
దిగులుమానిధైర్యమ్మున । దిరుగుచుంటికొడుకా !
పగవహించిబాలాజీ ! వరదుండు నాకుత్తుక
తెగనిక త్తితోడగోసె । తగుదయ నాపైనిడక ॥నీకు॥
సుగుణగణా ! నాకుంగల । పగవుమాన్పు వారేరీ
జగతిని నా క్షేమయు । దోచదు చూపుమేదియోదారి ॥నీకు॥

వ॥ ఇత్తెఱంగున బలవింపుచుండ హరిశ్చంద్రుం డాలకించి వచ్చి నీ వీనడురేయి నిచ్చటికేలవచ్చితివి. మరణమొందినవాడు నీకేమి కావలయు నేకారణమున నీత డంతమొందెనో చెప్పుమన నావెలంది.

ఆనందభైరవి—చతురశ్రగతి.

ఓపావనిచరితా సుజనవినుతపాత్ర! ॥యో॥
బాపనయ్య యింటగల్గినట్టి । పసులొనర్చి కాలముగడుపుచుంటి॥నో॥
నన్ను హంసనారి యనుచు బిలుతురు । నాయేలిక ఫలములు దెమ్మనగా
కన్నన నాకొమరుం డడవికి జని । కొన్ని పండ్లుగోయుచుండ న త్తఱి
పన్నగంబు వీనినిగఱువ గత । ప్రాణుడయ్యె నల్పజీవిదల్ప వీనిగాల్ప
సెలవొసంగు ॥యో॥

వ॥ ఇట్లు విన్నవింప నాతండాలోకించి నాయాజ్ఞలేనిదిప్రేతభూమికి వచ్చినందుకు నాడుదానవగుట మన్నించితి. ఇదియే మగవాడైనచో నీకర వాలమ్మున వాని తల తునియలుసేయక మాన. నాపేరు వీరదాసుండు వీరబాహుండగునాదొర శాసనం బవలంబించి యిచ్చటనుంటి. సొదపేర్చి నందుల కొకమాడ సమర్పింపవలయు. నీవంగీకరించితివేని మాడనిచ్చి చిన్నవానికి నగ్నిసంస్కారమొనర్పుము. లేదా, వచ్చినమార్గముఁబట్టుమన, మహాత్మా

తో॥ ఇడుము లనేకము పడుచుంటిని నాకీగతిప్రాపెసెనుధాతా
బీదరాల నెట్టియుంగల కాసైన లేదుచేత
కరుణింపుము చెదరిపడియున్న ఈకట్టెలెల్లం జేర్పుటకు
వెరపుమాన్పి సెలవొసంగుమిపు డీపీనుంగును గాల్చుటకు॥

వ. ఇట్లన హరిశ్చంద్రుడు యువతీలలామా! యిచ్చట నెవ్వరున్నారు? చేయవలసినకార్యము గావింప బాగుగనుండునని నీతలంపు. దేవునకు దాచగలమా? కావున

తో. తడయక చని నీయేలిక బాపనినడిగి మూడమూకిమ్ము
బుడుతను తదుపరి గాల్చవచ్చు నో పూర్ణేందువదన లెమ్ము.

వ. ఇట్లనఁ జంద్రమతి ప్రాణేశా! చిన్నవానిని జాగ్రత్తతో చూడుము చని వచ్చెదనని పారునింటికి బోవుచున్నతరి గాధేయునిచే పంపబడిన దొంగయొకడు కాశీరాజపుత్రుని జంపి యూనగలన్నియు దెచ్చి చంద్రమతిపయిబడవయిచి పిమ్మట రాజభటులతో కలసివచ్చి వారల కీవనజాక్షి నప్పగించ తద్భటు లీమెను కాశీరాజు ముందర నిలుపగా దీనిముఖముచూడగూడదు. వీరబాహునియొద్దకు దోకొనిపోయి తలనరుకవలసినదని యాజ్ఞ నేనిచ్చితి జనుడని రాజుపలుక నంత నామెను వీరబాహునియెుుట నిలుప నాతండు నానొకరు వీరదానుండు వల్లకాటిలో కావలియున్నాడు. వానియొద్దకు పొండన మంచిదియని చంద్రమతిని రుద్రభూమికి గొని తెచ్చి హరిశ్చంద్రుని యెదుట నిలువ నాతండు విస్మయమంది యేమిచిత్రము! రణభూమిని నోట గడ్డిగరచి వచ్చువారల నిరాయుధుల శరణము కోరువారల రక్షించు నేను నిష్కారణ మీయాడుదాని జంపవలసి వచ్చినది. చంపితినా స్త్రీహత్యవచ్చును, మానితినా రాజద్రోహమబ్బునని డోలాయమానమానసుండై చింతించు సమయంబున నాసాధ్వీలలామ పక్కన నవ్వి భర్త నవలోకించి.

సావేరి—ఆదితాళము.

అనుమానింపగ నేల యవనీశ్వరిపాల ॥ యను ॥
విను మీయేలిక చెప్పినగతి గావింపబూనుకొమ్ము లేలెమ్ము ॥అను॥
రాచపట్టిని జంపి నగలెల్ల దోచుకొంటిననుచు నీదుర్మార్గులు
నీచాపనింద నాపై నొకటి నిల్పినారు కాన వేరే యా
లోచింపగనేలా? బాలాజీలోపమెన్న నీఫాలాక్షుడేగతి
నీచేతికత్తిచే ననుద్రుంపు విరోచనాన్వయాబ్ధిచంద్ర! నరేంద్రా! ॥అను॥

వ॥ ఇట్లా వెలంది పలుక నరేంద్రుఁ డామె ధైర్యమ్మున కచ్చెరు వందె మంచిది యని నరుకబోవ నాసమయమ్మున విశ్వామిత్రుండడ్డుదెంచి కరవాలమ్ము పట్టుకొని భూపాలునిజూచి,

కమాచి—ఆదితాళము.

ఓరాజా! తగునా సతిని జంపబూనుట॥ లో॥
నీరధర త్యాగీ గజరజనీచరనూదనపదానురాగి॥ యో॥
రక్కసుడవుగాక ఆహా రాజువె? మతిలేక వసిష్ఠుడు
చక్కెరబోడుల జంపుమను చదువు మక్కువతో జెప్పెన
మన మొప్పెన॥ యో॥
అరిభూపాల సమాజోన్నత మదమణంపగల శక్తిగల నీ
కరవాలంబున గులాంగనకుత్తుక ఖండింపగ నాసక్తి ధరణీ
వర! దృఢముగఁబుట్టెన పిచ్చిపట్టెన నీనీతిగిట్టెన॥ యో॥
అమలంబయినట్టి నూర్యకులమునబుట్టి నీ
యనుంగుపడఁతిని సమయింపగ సమకట్టితివా? నీ నే
మమును దిగనాడి నా కూతుల హస్తములు పట్టినట్లయిన నీకూర్మి
కొమరుఁడుజీవించు మఱి నీకోమలిలభించు నీరా
జ్యము క్రమ్మఅవచ్చు బి. బాలాజీవరదుడు మెచ్చు॥నో॥ రాజా॥
వ॥ ఇట్లు విశ్వామిత్రుండన, హరిశ్చంద్రుండు మునికులోత్తమా!

తోడి—ఆదితాళము.

వినుమయ్య నామనవి వీనుంగవనొడ్డి॥ విను॥
మునుమీరు నాతో జెప్పిన బుద్ధులుగావె క్రొత్తలుగలవె॥ విను॥
పరులగతిని నన్నెంచక నాకరవాలమ్ము విడచి యింటికేసత్వర
మరుగుమింక బి. బాలాజీదాసావనుండు మిమ్ముగాపాడు నేడు॥విను॥
వ॥ ఇట్లన విశ్వామిత్రుండు సిగ్గున జనియె. పిమ్మట హరిశ్చంద్రుండు రెండవపర్యాయము నరికిన నాకరవాలమ్ము పూదండ తెరంగున కట్టుకొనిన నేలమగం డాశ్చర్యమంది మూడవపర్యాయము పరిశోధించెద నని నాభార్య పతివ్రతయయ్యెనేని యిప్పుడీకుత్తుక తెగునుగాక యని కత్తియెత్తిన నంతఁ జంద్రమతి నూర్యునిపైఁ జూడ్కినిల్పి హస్తములు కోడించి.

సీ॥ నన్ను బుట్టించితే నరజన్మమే నాకు, గరుణింపుమయ్యా యోకర్మసా
క్షి । అందు సద్గుణవంతురాలుగా చక్కనికాంతగా నుంపు మో
కర్మసాక్షి । సత్యాత్ముడగు హరిశ్చంద్రుని నాభర్తగా జేయుమయ్య
యోకర్మసాక్షి । ఆజ్ఞదప్పని లోహితాస్యుని సూనుండుగా నుంపు
మయ్య యోకర్మసాక్షి । వేదసాదలప్రీతి నాదరించుటకునై కనకం
బొసంగు మోకర్మసాక్షి । సంగీత సకల భాషాసాహితీ పరిజ్ఞానం
బొసంగుమో కర్మసాక్షి । ఆర్యానుకూల వేదాంతవిద్యాసక్తి గరు
ణింపుమయ్య యో కర్మసాక్షి । అంత్యకాలము వచ్చినప్డు ముక్తి
దువగా దలఁజేయు మోకర్మసాక్షి ।

గీ॥ నిర్మలకరప్రదీప యోకర్మసాక్షి
ప్రగహపతీ! లోకబాంధవా! కర్మసాక్షి
కమలచక్ర సమూహాప్త కర్మసాక్షి
కంజజాభవ! హరిరూప! కర్మసాక్షి.

వ॥ అని యిత్తెఱంగున ప్రార్థింపుచున్న సమయంబున.

హిం॥ భయిరవి...ఖండగతి.

అంత నాగీర్వాణు లంతరిక్షమ్మున నెంతయో చింతగొని వింత
గనుచుండఁ । జెంతగల భూతములు గొంతుకలబంటి నల్లంతగొన గూ
కలిడి గంతులిడుచుండఁ.

మిశ్రగతి.

తలమీద నల నెలవంకతో నొక కేల ముద్దులజింకతో
జడలందుగల మిన్నేటితో కొనవంగు చిటికెన గోటితో
గననింపుగల మింజడలతో విభూతిపూసిన యొడలితో
వెనునంటు నేనుగు తోలుతో నొక కేల ముమ్మొనవాలుతో
మెడనున్న పునుకలదండతో నొకచేత బంగారుకొండతో
కడునల్లకుత్తుకసొంపుతో నమ్మైన పాములగుంపుతో
తొడమీద విద్దెలప్రోడతో మునుమున్న తెల్లనిదూడతో
దయగల్గు చల్లనిచూపుతో పెనుమంచు గుబ్బలి పాపతో
మహానటుం డరుదెంచి నామానవతిని గావఁ.

వ. అంత నా యాలుమగ లాదేవుని విలోకించి,

ఆనందభైరవి—త్ర్యశ్రగతి.

పరమేశ్వర నీస్వరూ । పముగని ధన్యులమైతిమి
కలవుదీరె నింక దయా । కర గజదానవహరా॥ పర॥
దేవతలయినను నీమాయ । దెలియలేరు మృగధరా
మావశమా కనుంగొనను । మామనోబ్జబంభరా॥ పర॥
పాలిత బాలాజిదాస । భక్తజనాధినివాస
ఫాలాక్షా ! వ్యోమకేశ । పాపతిమిరదినేశా ॥ పర॥

వ. ఇట్లునుతిసేయు మహాదేవుం డాహరిశ్చంద్రుని మేను నిమిరి రాజా! మీసత్యమ్మునకు మిగుల సంతసించినాడ నిన్నికష్టములు ముట్ట డించెనని వగవకుమని బుజ్జగించి,

సావేరి—ఆదితాళం.

రాజా! దీనమానవకల్పభూజ విరూపవినిర్జితరతి॥ రాజా॥
రాజరాజశేఖర బీ. బాలాజీవరద పాదానుమోద॥ రాజా॥
నడుమున జర్మము వేసి పెన్నొడల విభూతిని బూసి
బడుగుదయ్యములు గొలువగ నీ । వల్లకాటికిం బ్రభుడవైతివో
పుడమి జేడ నాతో సమానుండవీవు నీ
నడత లితరభూపతులకునరయగ లేవునుగుణములకుస్థానమీవు ॥రాజ॥
చూడు, నీభార్యనేలిన । వాడు, కలిరాజు బాపండు
గాడు, నీయొడయుడగుమాల । వాడు, సమవర్తి యిదివల్ల
కాదుగాదు జన్మము:లొనరించెడి ।పాడు సందియంబేల గనుగొనుము
నేను భూమిలోనీకు సమానుడు।లేడు మదినిగలగోడుదిగనాడు ॥రాజ॥

వ. ఇత్తెరంగున బల్కి- హరిశ్చంద్రుని కన్నుగవందుడువ నాతం డంతయు జూచి, విస్మయమంది,

క॥ జలజారివమౌళి నీ మహి
మలు బలరిపు పద్మభవరమాపతులైనన్
దెలియగ లేరను వాడుక
కలదిక మాటొంట్లకెల్ల గనుగొనవశమే.

వ. అంత చంద్రమతిని పార్వతీదేవిగాంచి, యమ్మా! నీపతివ్రతా ధర్మమున కెంతయో యానందించితి. నీయభీష్టం బెఱింగింపుమన, నాచం ద్రమతి, అమ్మా, కాత్యాయనీ! కాశీరాజసూనుని జంపినాననునింద నొందియున్నాను. ఆచిన్నవానిని సజీవునిగాజేసి నాకుంగల యపనిందఁబా పుమని ప్రార్థింప, సాధ్వీలలామా! నీకేచింతయేల? ఇదివరకే బ్రతికించితి సందియమొందకుమను సమయమ్మునె లోహితాస్యుండు లేచినిలువంబడ నాసుగుణవతి కడలేని యానందమున గొమరునెత్తుకొని ముద్దిడుచున్నంత విశ్వామిత్రుండరుదెంచి, యోహరిశ్చంద్రా! నీయెడలం జాలనపరాధి నైతి క్షమింపుము. మఱల నీ రాజ్యమును గైకొనుమన, రాజు తపో ధనా! మీ కృపారసమువలన నా యశంబు లోకమున వ్యాపించుటచే నాకు మేలుగావించిన వారలలో మీ రగ్రగణ్యులు. రాజ్యమునాకక్కర లేదు. మీరే యనుభవింపుడు. లేనిచో మీ యిష్టమువచ్చినవారిచే పరిపాలింప జేయుడనిపల్కు గాధేయుండు రాజా; నాకుంయిష్టముఁగల రాజు వు నీవే పాలించెదవా అన్నృతమాడెదవా? యని పలుకుసమయమ్మున వశిష్ఠుండరుదెంచి, యోహరిశ్చంద్రా! నాశిష్యుండ వైనందునకు నామర్యా ద నిల్పితివి. ఈతడు క్రమ్మర రాజ్యభారము వహింపుమని కోరుచున్నా డు గనుక, నాపాటిమాటయైన జెల్లింపకున్న సరసముగానుండదు. గావున గాశికునితో గోరికదీర్పుమన హరిశ్చంద్రుడు వల్లెయన మరల రాజ్యముం బాలింప నుద్యుక్తుడైనంత, నచ్చట పట్టాభిషేకంబొనరించిరి. పిమ్మట నారదుం డయోధ్యకరుదెంచి హరిశ్చంద్రుడు వచ్చుచున్నాడని సత్యకీర్తి తో విన్నవింప, నాసత్యకీర్తి యత్యంతానందమ్మున కౌశికునాజ్ఞచే పట్టణం బలంకరించి యెదురుగ వచ్చి హరిశ్చంద్రునిదోకొనిచని పట్టాభిషేకం బొన రించిరి. తదనంతరము సతీసుతసమన్వితుండయి యనుకూలమ్ముగా రాజ్యం బేలి యంతమున సద్గతినొందె. ఇట్టి హరిశ్చంద్రచరితమునువినువా రన్నృత దులుగాకుండ నుండునటుల ప్రయత్నించి తత్ఫల మనుభవింతురుగాక.

త్రైశంకువిజయముసమాప్తము.

మంగళం మంగళం మహత్.

